# బాలికా వివాహ నిషేధ శాసనము.

సనాతనధర్మపరాయణులారా ! మేల్కొనుడు !

☞ నిద్రించుట కిది సమయముకాదు ☜

సనాతనధర్మపరాయణులును, శాంతికాములును, స్వస్వవర్ణాశ్రమాచారధర్మశీలురును అగు హిందూమహాజనులారా! మీకు కష్టకాలము సంప్రాప్తించినది. మన మితర మతములవారికిగాని, సంఘములకుగాని అపకారము చేయుటలేదే, ఇతరులుమాత్రము మనకు అపకార మేల చేసెదరు ? అను దృఢవిశ్వాసముతో మీరున్నారు గాని ఈ పాపిష్ఠ కలికాలమునందా నియమము చాలవఱకు నశించినది.

శ్లో॥ ' మృగమీన సజ్జనానాం తృణజల సంతోషవిహితవృత్తీనాం
లుబ్ధక ధీవర పిశునా నిష్కారణ వైరిణో జగతి॥ '

అను న్యాయము ననుసరించి తమకు ఇతరులు అన్యాయము చేయకపోయినను,ఇతరులకు అన్యాయమొనర్చి వారిని హింసించుటయే స్వభావముగా గల జనసముదాయ మీ కలికాలమునందచ్చటచ్చట గనంబడుచుండును. కష్టముల సహించి శాంతికాములమై కాలక్షేపము నెట్లో చేయుట స్వభావముగా గల మనము పరులు మనయందు సలిపెడి యన్యాయము ఇహలోకమునకు మాత్రమే సంబంధించియుండు నెడల చాలవఱకు నెట్లో సహించి యూరకొనవచ్చును గాని ఆ యన్యాయము మతాచారములకు సంబంధించినది అయినయెడల ఇహపరలోకములకు మనము దూరులమగుదుము. కావున అట్టి యన్యాయమునకు తగిన ప్రతిక్రియను మనముచేసి మన మతాచారధర్మముల కాపాడుకొనవలయును గాని ఉపేక్షించియుండుట మాత్రము ఇహపరలోకదూరముగదా !

## బ్రిటిషు ప్రభుత్వము, మతాచారస్వాతంత్ర్యము.

బ్రిటిషుప్రభుత్వమునందు మొట్టమొదటి చక్రవర్తిని యగు శ్రీవిక్టోరియా రాణిగారు "పాలితజాతులయొక్క మతాచారవిశ్వాసములయం దెంతమాత్రము మేము జోక్యము కలిగించుకొనము. మీ మీ శాస్త్రవిశ్వాసము,ఆచారము ననుసరించి మీరు చరింపవచ్చును" అని చేసిన ప్రాక్లమేషనును అనుసరించి నానావిధమతములవారము మన మతాచారములను నిర్భయముగ నాచరించుకొనుచు నేటివఱకు సుఖించుచున్నాము. బ్రిటిషుప్రభుత్వమునందు జనులకు విశ్వాసము కలుగుట కిదియే మూలకారణము. స్థితిగతు లిట్లుండగా భరతవర్ష పరిపాలకులగు బ్రిటిషువారు మనకు బోధించిన విద్యచేత హూణభాషాభిజ్ఞులగు జనసముదాయమునందు కొందఱకు భారతీయాచారవ్యవహారాదికమునందు నిరసనబుద్ధి యేర్పడి స్వేచ్ఛాచారబుద్ధి పొడమి తమ యిష్టానుసారము విధవాపునరుద్వాహాది చట్టముల ప్రవేశపెట్టిరి. సంఘమునందుండువారితో సంఘర్షణము జరుగుచుండునే యను భయముతో సనాతనశాస్త్రీయాచార పరాయణుల మగు మనము ప్రప్రథమమున అట్టి బిల్లులకు ప్రతికూలాభిప్రాయము గనంబఱచినను తరువాత ఇష్టమున్నవాడు జేసికొనుటకు అనుజ్ఞనిచ్చుటయే గదా మన కేమి నష్టమని ఉదాసీనత వహించుటచేత అట్టి చట్టము లేర్పడెను. తరువాత హూణభాషాభిజ్ఞులగు వారిలో కొందఱు రాజకీయముగ ఎక్కువ సౌకర్యములను ప్రభుత్వమువారినుండి పొందుటకొఱకు కాంగ్రసు అనుపేర నొక సంస్థ నేర్పఱిచి రాజకీయాందోళనమును సేయసాగిరి. దాదాభాయినౌరోజీ మున్నగు దేశనాయకులు హూణభాషాభిజ్ఞులలో కొందఱు కోరెడి వర్ణసంకరరూపమగు సంఘపరివర్తనమును తాము అభిలషించువారైనను ఇట్టి కాంగ్రసు సభలయందు

చేరువా రట్టి విషయముల పరిష్కరించుట కనర్హులనియు, వీూదు మిక్కిలి యిది ఐకమత్యభంజకమనియు నిర్ణయించి రాజకీయేతరవిషయ ముల కాంగ్రసునందు చర్చింప నిచ్చగింపరైరి. భారతీయమతాచార ధర్మముల నిరసించుటయే ప్రధానముగా గల సంఘసంస్కరణసభను కాంగ్రసు సభామంటపమునందు జరుపుటకుకూడ పూనానగరమున జరిగిన కాంగ్రసుసమయమున కీర్తిశేషులగు లోకమాన్య బాలగంగా ధర తిలకుగారు అంగీకరింపక ప్రబలాందోళనము సల్పియుండిరిగదా ?

## అర్ధస్వరాజ్యము - శాసనసభలు.

---

తరువాత పార్లమెంటో సంస్కరణము లనుపేర ప్రభుత్వము వారు శాసనసభ లనుపేర కొన్నిటి నేర్పఱిచి కొంతవఱ కధికారమును కొన్నివిషయములందు ప్రజాప్రతినిధుల కొసంగిరి. ఇట్టి యధికారము ప్రజాప్రతినిధులకు లభించిన తరువాత తాము సంఘసంస్కరణాది రూపవిదేశీయాభిరుచులకు సుముఖులగుటచేత జనసామాన్యము తమ యందు విముఖమగునేమో యను తలంపుతో ఆయామతములకు చేరినవారి మతాచారవిశ్వాసములకు ప్రతికూలమైన చట్టములను మే మెప్పుడున్నూ చేయము. అల్పసంఖ్యగలవారి హక్కులను ప్రప్రథమ మున కాపాడియే తరువాత అధికసంఖ్యగలవారి హక్కులను సంర క్షించుటకు ప్రయత్నించెదము. అని మాటిమాటికి శ్రీరంగనీతుల పలుకుచుండిరి. భారతీయోన్నతియం దభిమానముగల శ్రీయుత నౌరోజి, తిలకు మున్నగు మహాశయులు కీర్తిశేషులైన పిదపి శ్రీయుత గాంధి మహాశయులు రాజకీయరంగమునకు నాయకు లగుట యేర్ప డెను. వారు " నే జెప్పిన నియమముల మీూరు పాటించినయెడల నెల

రోజులలోపల స్వరాజ్యమును మీకిప్పించెద ” నని జనులకు బోధింపగా వారి వాక్యమునందుగల దృఢవిశ్వాసముతో ఇండియాయందు ఒక గొప్ప యాందోళనము సాగెను. వారి వాక్యము ప్రకారము స్వరాజ్యము లభింపకపోవుటయేగాక పలువిషయములు తారుమారై సంఘమును మాత్రము బీభత్సము నొనర్చెను. వారి యాందోళనమునకు ప్రతిఫలముగ కాంగ్రసు వేదికయందు సంఘసంస్కరణమను పేర సంఘవిప్లవకరములగు కృత్యములు కొన్ని నిర్ణయింపబడెను. సంస్కృతభాషనుగాని, భారతీయ ధర్మగ్రంథములనుగాని తెలియనివారున్నూ, తులసీదాసు హిందీరామాయణమును, గుజరాతిభాషాంతరీకరణమూలమున భగవద్గీతాగ్రంథమును మాత్ర మెఱింగినవారును అగు శ్రీయుత గాంధిగారు మతాచారసంస్కరణమునకు అధ్వర్యము వహించినప్పుడు తదనుయాయుల విషయమును చెప్పుట యనావశ్యకముగదా! ఈ కంపెనీవారి శిష్యప్రశిష్యతుల్యులే ఇప్పుడు శాసనసభలయందు అధికసంఖ్యాకు లుండుటచేత ఇట్టి బిల్లులను తెచ్చుటకు తమ కధికారము లేకపోయినను అప్పు డప్పుడు తెచ్చుచునే యున్నారు. మతాచారములయందు జోక్యము కలిగించుకొనమని వాగ్దాన మొనర్చిన ప్రభుత్వమువా రేలకో అట్టి శాసనముల కవకాశ మిచ్చుచున్నారు. ఇప్పుడు ఆర్యసమాజసభ్యుడగు ‘ హారవిలాసశారదా’ యను మెంబరు బాలికా వివాహశాసనమును పేరుతో 16 సం॥ లోపల బాలికలకున్నూ 18 సం॥ లోపుగ బాలురకున్నూ వివాహము జేయగూడదనియు, చేసినవారికి తత్ప్రోత్సాహకులకు రు. 1000 లు అపరాధముగా వేసి 1 మాసము శిక్ష వేయవలయుననియు ఇండియా శాసనసభయందు శాసనమును తెచ్చియున్నారు. ఇప్పుడు ప్రజాభిప్రాయమునకై ఈ బిల్లు ప్రకటింపబడినది. కనుక మీరు ఈ బిల్లు మా మతాచారవిరుద్ధమని ప్రభుత్వమువారికి తెలుపవలయును.

ఇంగ్లీషు భాష చదివి మనోదార్బల్యమునందని జనసముదాయ మునందు దాదాపు నూటికి 95 రకు మతాచారధర్మములందు విపరీత భావ మేర్పడియుండలేదు. వారు తమ తమబిడ్డలకు వివాహ, గర్భాధానాది కృత్యముల నెప్పుడాచరించుట యుక్తము, ఎప్పుడు చేయగూడదు మున్నగు విషయములను తామెఱుంగుదురు. కొన్నితావుల ఏయొకరిద్దఱో యిట్టివిషయములను నిర్ణయించుకొనుటకు తమకు బాగుగా తెలియనియెడల వారు తమతమ యాప్తబంధువుల సలహాను తీసికొనుటయు గలదు. ఇది మనుష్య సాధారణధర్మము. రాజకీయ భాషాభిజ్ఞులలో కొందఱకుమాత్రము తల్లిదండ్రుల కీవిషయము తెలియదనియు, పోలీసువారే ఇట్టి విషయము నెఱుంగుటకు తగినవారనియు, తాము తలంచిన వారలయి స్త్రీలకు సంబంధించిన యిట్టి విషయములలో పోలీసుఅధికారులు జోక్యము కలిగించుకొనినయెడల రాబోవు అనర్థములను ఇతరులు చెప్పుచున్నను వానినిగూర్చి యాలోచింపక "తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళు" అని వాదించుచు ఇట్టి చట్టముల శాసనసభలయందు తెచ్చి సంఘక్షోభము నొనర్చుచున్నారు.

పండితులయినవారీసమయమునందు "కానున్నది కాకపోదు కమలజనాభా" యని బరువంతయు దైవముమీాదపెట్టి యూరకొనక ఇట్టి బిల్లులవలన గలుగబోవు చిక్కులను జనులకు బోధించి మహాజర్లు సిద్ధముచేసి ప్రభుత్వమువారికి పంపి జనులకుగల వ్యతిరేకాభిప్రాయమును తెలుపవలయును.

దక్షిణదేశమునందు శ్రీకుంభకోణ పీఠాధిపతుల పర్యాలోచనముతో పండితబృంద మిప్పు డీశాసనమునకు వ్యతిరేకాందోళన మొనర్చుచున్నది. ఆయా జిల్లాలయందుండు పండితులు తమకు సమీాపమునందుగల నగరములకు గ్రామములకుబోయి సభలొనర్చి ఉపన్యసించి తీర్మానించి ఆ సభాతీర్మానములను మహాజర్లను ప్రభుత్వము

వారికి పంపుచూ బిల్లువలన రాబోవు అనర్థములను ప్రజలకు బోధింపుచున్నారు. "ఇట్టిబిల్లు మతాచారములకు విరుద్ధము కావున దీనిని తొలగించవలయుననియు, ఇకమీద నెవ్వరైన ఇట్టి బిల్లులను శాసన సభలకు తెచ్చినయెడల వానిని అంగీకరింపవలదనియు గవర్నరు జనరలు దగ్గఱకు రాయభారము పోవుటకుగాను ప్రతిజిల్లానుండియు ప్రతినిధులను నిర్ణయించుచున్నారు. మన యాంధ్రదేశమునందుకూడ మనమున్నూ యిట్టి యాందోళనముచేసి మన మతాచార స్వాతంత్ర్యమును కాపాడుకొనవలయును.

## చేయవలసిన రీతి.

1. ఆయాగ్రామములందు సభలుచేసి యీ బిల్లువలన మనకు రాబోవ్యేనష్టములు, అవమానములు, మానభంగములు మున్నగునవి చక్కగా జనులకు బోధింపవలయును. బోధించిన తరువాత

1. హిస్ ఎక్సలంసి ది గవర్నరు జనరలు ఇన్ కౌంసిలువారికి సిమ్లా.
2. ది సెక్రటరి లెజిస్లేటివు డిపార్టుమెంటు, గవర్నమెంటు ఆప్ ఇండియా — సిమ్లా.
3. హిస్ ఎక్సలంసి ది గవర్నరు ఆప్ మదరాసు ఇన్ కౌంసిలు వారికి మదరాసు.
4. సెక్రటరీ లెజిస్లేటీవు డిపార్టుమెంటు గవర్నమెంటు ఆప్ మదరాసు.

ఈ నలుగురకు విడివిడిగా మహజర్లమీద దస్కతులు చేయించి దస్కతు జేసినవారికి హోదా అడ్రసు మున్నగునవి అవకాశ మున్నంతవఱకు ఇంగ్లీషులో జేయించి తిరుగు రశీదుతోసహా రిజస్టరుగా పంపవలయును. కవరుపైన చేరినటుల రశీదు మనకు చేరుటకుగాను ఒకరి పేరును మాత్రమే వ్రాయవలయును.

ఇంతమంది దస్కతులతో ఈమహజరు గౌర్నరుజనరలు వగైరాలకు పంపి ఆకాపినిమాత్రము మీకు పంపినామని సూచించుచూ ఏయే జిల్లానుండి పంపుచున్నారో ఆజిల్లాయొక్క.

1. డిస్ట్రిక్టు మేజస్ట్రేటుగారికిన్ని

2. డిస్ట్రిక్టు పోలీసు సూపరెంటుగారికిన్నీ ఒక్కొక్క కాపీని మామూలు కవరులో పంపవలయును. ఇండియాశాసన సభాసభ్యులగు M. K. ఆచార్య అనువారు యీబిల్లు మతాచారధర్మములకు విరుద్ధమయినదని ఈబిల్లునకు వ్యతిరేకముగ శాసనసభయందు వాదించియున్నారు, కావున ఒక్కకాపిని M. K. ఆచార్యగారు M. L. A నెం 46 లింగిశెట్టివీధి, మదరాసు అని పంపించవలయును.

3. స్థానిక ఆంధ్రపత్రికలకున్నూ తెలుపవలయును. హిందూ పత్రిక మున్నగు ఇంగ్లీషు పత్రికలకు ఇంగ్లీషుతోనున్నూ పంపుట చాలామంచిది. ఈ పని అంతయు జూను మాసములోపల జరి తీరవలయును. తాలూకాకు ఒక రిద్దఱు ఎక్కుడు శ్రద్ధను వహించి గాని యీ పని నెరవేరదు. దేశ దురదృష్టవశముచేత ఇప్పుడు ప్రకటింపబడుచున్న పత్రికలలో దాదాపు 15 పాళ్ళు సనాతనధర్మ ప్రతికూలురగువారిచేత నడిపింపబడు చున్నవి. వీరికి ఒక నీతిగాని న్యాయముగాని లేదు. ఏలయందురా! ప్రజాభిప్రాయమును తెలుపుటయే మాధర్మమని చెప్పుచుందురు గాని తమ కిష్టములేని విషయములను ప్రకటింపరు. ఇదియేనా ప్రజాభిప్రాయ ప్రకటనము.

వెనుక క్రూరప్రభుత్వమువారు కత్తితో బెదరించినప్పుడుకూడ నిర్భయముగా కత్తికి తలయొగ్గి కాపాడుకొనివచ్చిన మన మతాచారధర్మములను సంఘసంస్కరణ మనుపేరుతో వర్ణసంకరమును ప్రచారము చేయుచున్న "రిఫార్మర్లు" అనువారు మన మతాచారనియమము నెఱుగని ప్రభుత్వమువారియందజేరి శాసనము లొనర్చి వర్ణసంకరము జేయింప దలంచినారు. వారి దురుద్యమమును మనమిప్పుడ

తగిన కట్టుదిట్టముతో ఎదుర్కొనవలయును. పండితులు తమ విద్యను ధనికులు తమ ధనమును ఇందులకు వినియోగించి పరిశ్రమ యొనర్ప వలయును. ఆయా జిల్లాలయందు మతాచార ధర్మాభిమానులును, రాజకీయ భాషాభిజ్ఞులును అగు వారి నొకరిని సంఘాధ్యక్షునిగా నెన ర్చుకొని యీ ప్రచారమునకు వలయు ధనసహాయమును సేకరింపవల యును. పండితులగువారలు గ్రామగ్రామములకు బోయి సభలు చేసి మహజరు మున్నగునవి పంపుచూ ఎప్పటివిషయ మప్పటికి దేశభాషా పత్రికలయందున్నూ హూణభాషా పత్రికలకున్నూ తెలుపుచుండ వలయును. ఒక్కొక్క మండలమునుండి తగినవారిని వైసరాయిగారి దగ్గఱకు రాయభారము పంపుటకు ఏర్పఱచి అన్నిజిల్లాలనుండి ఏర్పఱె చినవారి కొకచోట సమావేశ మేర్పఱిచి తాము వైస్రాయిగారితో చర్చింపనున్న విషయము నేకగ్రీవముగ ముందు తీర్మానించుకొనవల యును యుక్తమని తోచినయెడల ద్రావిడదేశమునం దీవిషయమై పని చేయుచున్నవారితో సంప్రతించవలయును.

ఆంధ్రదేశమునకు చేరిన జగద్గురు పీఠాధిపతులతో సంప్రతించి తగిన సహాయమును అన్నివిధముల పొందవలయును.

అచ్చటచ్చట గ్రామములందు సభలు మున్నగునవి మనము చేయునప్పుడు రిఫార్మర్లు అనువారు మనతో నిష్కారణముగ పోట్లా డుటకు వచ్చినయెడల వారితో పోట్లాడుచు కాలక్షేపము చేయవలదు. మీ యిష్టానుసారము మీపిల్లలకు పెండ్లిండ్లు చేసికొనుటకున్నూ మానుకొనుటకున్నూ ప్రభుత్వమువారి చట్టమేమియు మిమ్ములను బాధించుట లేదుగదా ! శాస్త్రీయమని మేము విశ్వసించి ఆచరించు చున్నదానికి విరుద్ధముగ చట్టము నేర్పఱుచుచున్నారు. కావున మేము దానిని త్రోసివేయించుకొనుటకు ప్రయత్నించుచున్నారము. మీకుప కారమగు శాసనము లేకపోయినను, మాకపకారముచేయు శాసనము నిర్మింపుడని కోరుట అధమాధమకృత్య మనిమాత్రము చెప్పుడు.

---

# హరవిలాస శారదాగారి బాల్యవివాహ చట్టము.

# సెలెక్టు కమిటీ రిపోర్టు.

( ఆంధ్రపత్రికనుండి గ్రహింపబడినది. )

భారత శాసనసభలో ప్రవేశపెట్టబడిన యీ చట్టము బాల్య వివాహముల నిలుపుచేయుట కుద్దేశింపబడినది. ఒక నియమిత వయస్సునకు ముందుగా బాలబాలికలకు జరుపబడు వివాహము లేవియు చెల్లకుండునట్లుగా చేయుటయే యీ చట్టమునం దనుసరింపబడిన విధానమై యున్నది. ఈ చట్టము ప్రభుత్వమువారి యుత్తరువుపైని దేశమునం దంతటను ప్రకటింపబడగా జరుపబడిన వివాహముయొక్క న్యాయత్వముతో జోక్యము కలుగజేసికొనుట మతసంబంధమగు కారణముల బట్టియేగాక న్యాయచట్టసంబంధమగు కారణములబట్టి గూడ యక్రమమను భావము చాల తీవ్రముగా వెల్లడియయ్యెను. ఈ యాక్షేపణలను ప్రస్తుతము త్రోసివేయుటకు వీలులేదని మే మభిప్రాయపడుచున్నాము. కాబట్టి, దేశమం దంతటను విరివిగా వెలువడిన యొక సలహాపైని మే మీచట్టమును సవరించితిమి. ఈ సలహా యెట్టి దనగా, బాల్యవివాహముల నాపివేయు నుద్దేశము కొనసాగుటకుగాను, అట్టి వివాహములు న్యాయవిరుద్ధములని కొట్టివేయబడకుండ, అట్టి వివాహములలో పాల్గొనువారలపై శిక్షలు విధింపబడవలెను.

ఈ యుద్దేశముతో చట్టమును సవరింపబూనుటకు ముందుగా, మేము ప్రారంభమున చట్టములో చాలవరకు మార్పులు గావించుట యందుగల న్యాయాన్యాయములగూర్చి విచారించితిమి. ఈ చట్టము యొక్క మూలసూత్రము శాసనసభ యామోదించినది. అదెట్టిదనగా బాల్యవివాహములు శాసనము మూలమున నిలుపుచేయబడవలెను. కాని అట్లు నిలుపుచేయుట కనుసరింపబడవలసిన మార్గము సదరు చట్టములో సూచింపబడినట్లుగాక, వేరొకవిధముగా ప్రజాభిప్రాయము ప్రకారము మార్చుటకు సెలెక్టుకమిటీ కధికారముగలదు. మేము సూచించు మార్గము ప్రజాభిప్రాయమున కనుగుణ్యముగనే యున్న దనుట నిస్సంశయము. ఈ మార్గమే ప్రస్తుత మనుసరింపబడదగినదని మా యభిప్రాయము. అయినప్పటికిని సెలెక్టుకమిటీలో సదరు చట్టము మొత్తముమీద మఱియొక నూతనచట్టముగా మార్పబడుట యొక విపరీతచర్యగా మేము దలంచుచున్నాము. కాబట్టి చట్టముయొక్క భావిగమనము ప్రజాభిప్రాయము పూర్తిగ వెల్లడియైన పిమ్మటనే పూర్తియగు విచారణపైని క్రమమగు మార్గము ద్రొక్కవలెను.

ప్రవేశపెట్టబడిన చట్టము హిందూ, జైన, సిక్కు, బ్రాహ్మో, ఆర్యసమాజ, బౌద్ధమతస్థులకే సంబంధించియున్నది. అయితే ఏ బాల్య వివాహములో నైనను పాల్గొనువారికి శిక్ష విధింపబడునట్లుగా మేము చట్టమును సవరింప జూచుచున్నాము. కాబట్టియు మరికొన్ని ఇతర సంఘములలోగూడ బాల్యవివాహము జరుగుచున్న కారణముచేతను సవరింపబడిన చట్టము సామాన్యముగా బ్రిటీషు ఇండియాలోని యన్ని తరగతులవారికిని సంఘములకును వర్తించవలెనని మేము సూచించు చున్నాము.

చాల చర్చ సలిపినమీదట బాలురకు 18 సంవత్సరములును బాలికలకు 14 సంవత్సరములును వివాహవయఃపరిమితిగా మేము నిర్ణయించితిమి. ఈ వయస్సులు అత్యున్నతవయస్సు అని యనేకుల యభిప్రాయమై యుండుట గుర్తించుచున్నాము కాని యింతకంటె తక్కువ వయస్సుల కంగీకరింపని సంఘసంస్కర్తల యభిప్రాయముగూడ చాల బలముగా నున్నది. ఇంతేగాక, పదునాలుగేండ్లకు తక్కువగల బాలికలకు తరుచుగా వివాహము జరుపనట్టి కొన్ని సంఘములుకూడ భారతదేశమందు గలవు గాన, ఇంతకంటె తక్కువ వయస్సు నిర్ణయింపబడినచో నదియే వివాహమునకు తగిన వయస్సుగా యీ సంఘమువారు భావించుట కవకాశ మేర్పడగలదు.

నిర్ణయింపబడవలసిన మఱియొక ముఖ్యసూత్ర మేమనగ, బాల్యవివాహములలో పాల్గొనువారలలో నెట్టివారు శిక్షార్హులో నిరూపింపబడుట.

ఈ క్రింది తరగతులవారు చట్టముక్రింద శిక్షార్హులగుటకు మేము నిశ్చయించితిమి :—

(1) పసిబాలికను వివాహమాడు యౌవన పురుషులు. (2) బాల్యవివాహమునకు సంబంధించిన విధాయక కృత్యమును దేనినైన నొనర్చినవారు. (3) బాల్యవివాహమునకు ప్రోత్సాహమును అనుమతిని యిచ్చు తలిదండ్రులు లేక పోషకులు.

పై 1 వ యంశము చాల చర్చపైని నిశ్చయింపబడెను.

ఒక పసిబాలుని వివాహమాడు స్త్రీవిషయమున నెట్టి శిక్షయు సూచింపబడలేదు. ఎందు కనగా యిట్టి వివాహము జరుగుటయరుదు.

ఇంతేగాక అట్టి వివాహ మొకవేళ జరిగిననుగూడ వరుడు బాలుడగుటవలన వరునిపక్షమువారు చట్టముల క్రింద శిక్షార్హు లగుదురు.

యౌవనపురుషుల విషయమున 18-21 యేండ్ల నడుమనుండువారు మెజారిటీ వయస్సు వచ్చియున్నవారైనప్పటికిని, వారి తలిదండ్రుల యధీనములో నింక నుందురుగాన, తమ తలిదండ్రులచే నిశ్చయింపబడిన వివాహమునకు తామే పూర్తియగు బాధ్యతవహింపజాలరు. కాబట్టి యట్టి చిన్నపురుషులను శిక్షించుట యన్యాయము గనుక, వీరికి రు. 1000 లు జరిమానా శిక్ష మాత్రమే విధించబడినది. 21 యేండ్లుదాటిన పురుషులకు ఒక మాసము విడి ఖైదుగాని, రు. 1000 వరకు జరిమానాగాని, లేక రెండుశిక్షలుగాని విధింపబడినది.

బాల్యవివాహపు కేసులను విచారించుటకు రాజధాని మేజస్ట్రేటుకోర్టులకును, జిల్లా మేజస్ట్రేటుకోర్టులకును మాత్రమే యధికారము వుండవలెను. ఏ వివాహముగూర్చిగాని వివాహము జరిగిన యొక సంవత్సరములోగా ఫిర్యాదు చేయబడవలెను. కోర్టు ఫిర్యాదులు త్రోసివేసిననే తప్ప, అన్ని కేసులయందును ముందుగా ప్రారంభ విచారణ సలుపవలెను. ఫిర్యాది ముందుగా పూచీకత్తు నొసగవలెను.

ఈ చట్టము 1930 సం॥ ఏప్రిలు 1-వ తేదివరకు అమలులో బెట్టబడగూడదు. ఈలోపున చట్టముయొక్క నిబంధనలు, యుద్దేశములు, అన్నితరగతులవారికిని సంఘములవారికిని విరివిగా ప్రకటింపబడవలెను.

ప్రవేశపెట్టబడిన చట్టము 7-2-1927 తేది ఫోర్టుసెంటుజార్జి గెజెటులో ప్రకటింపబడియున్నది. సదరు చట్టము మాచే యనేక మార్పులతో సవరింపబడియున్నందునను, మరల ప్రకటింపబడవలయు

ననియు, ప్రస్తుతశాసనసభా సమావేశములో చట్టము నామోదింప జేయుట కెట్టి చర్యలు దీసికోబడగూడదనియు, యీ సమావేశము నకును రాబోవు సమావేశమునకును మధ్యకాలములో యీ చట్టమును ఆంగ్లభాషలోనే గాక అన్ని ముఖ్య మాతృభాషలలోగూడ సాధ్యమగునంత విరివిగా ప్రకటింపవలెననియు మేము గోరుచున్నాము.

ఇట్లు:- మహమ్మదు యాకూబు. జె. క్రియారు. హరవిలాస శారదా. లజపతిరాయి. రంగవిహారిలాలు. ఎం. ఆర్. జయకర్. ఎచ్. ఎ. జె. గిడ్నే. ఎం. ఎం. మాలవ్యా. హెచ్. ఎస్. గోర్. డబ్లియు. ఎ. క్రాన్‌గ్రేస్. ఎస్. శ్రీనివాసయ్యంగారు. కె. సి. రాయ్. జె. సి. ఛాటర్జీ. డి. చమ్మనులాలు. గంగానందసింహా.

సెలెక్టుకమిటీ సభ్యులు, 21-3-1928.



# భిన్నాభిప్రాయములు.

---

పండిత మాలవ్యాగారి యభిప్రాయము.

చట్టము శాసనసభచే విచారింపబడినపుడు నేను సూచించి యుండిన మార్గములనుబట్టి బాలురకు సవరింపబడినందుకు నేను సంతసించుచున్నాను. కాని, రెండు ముఖ్యవిషయములలో మాత్రము నాతోడిసభ్యులలో నధికసంఖ్యాకులతో నే నేకీభవించను. 11 యేండ్లకు లోపువయస్సుగల బాలికల వివాహములు శిక్షార్హములుగా జేయు సూచన పూర్వాచారహిందువులలో నెక్కువమందిలో న్యాయమగు ప్రతికూలభావము పెరుగుటకు కారణమగును. సదరు వయస్సు 11 యేండ్లకు నిర్ణయింపబడవలెననియు, హిందూసంఘముయొక్క అన్ని పక్షములవారి యేకగ్రీవాభిప్రాయము. అందుకు సమ్మతించేయెడల అట్టి నిర్ణయము శాసింపబడవలెననియు నేను గట్టిగా చెప్పియుంటిని.

12 యేండ్లవయస్సు నిర్ణయింపబడినను గూడ, పూర్వాచారాభిప్రాయములో కొంతభాగము అందుకు సమ్మతింపవచ్చును. కాని, నా యభిప్రాయములో, హిందువుల వివాహ మొక మతసంబంధమగు పవిత్రకార్యమగుటచేతను, వారిలో వివాహపూర్వం వయస్సువిషయమున చిరకాలమునుండియు ప్రబలియున్న సంపూర్ణవిశ్వాస మట్లే యుండుటచేతను, 12-14 యేండ్లకు నడుమవయస్సున జరుపబడు వివాహమును శిక్షార్హ మొనర్చుట చాల పొరబాటు. బాలికల వివాహార్హ వయస్సు 12 యేండ్లకంటె నెక్కువ గావించుట, ప్రజలలో నెక్కువ విద్యావ్యాపకమువలనను, సాంఘిక, శారీరవిషయక సద్భావముల

పెంపొందింపజేయుటవలనను, సాధ్యపడగలదని నేను తలంచెదను. వీని ఫలితము లిదివరకే గానబడుచున్నవి.

సదరు చట్టముక్రింద శిక్షార్హులగువారి కెట్టి జయిలు శిక్ష విధింపబడుటకును నేనంగీకరింపను. ప్రభుత్వమువారు ప్రజల సహకారమును బొంది చట్టనిబంధనలను ప్రజలకు బోధపడునట్లుగా విరివిగా ప్రకటించినచో, వేయిరూప్యములవరకు జరిమానా విధించబడునను భయము, శిక్షకు లోనుగావలసి వచ్చునను లజ్జాభావము, ఈ రెండును బాల్యవివాహములను జరుపకుండ ప్రజల నాటంకపరుపగలవని నేనూహించెదను. ఎట్టి సందర్భములోనైనను, క్రొత్తశాసనము అమలు జరుపబడిన మొదటి కొద్దిసంవత్సరముల వరకును జైలు శిక్షను చేర్చుటకు నేనంగీకరింపను.

## డి. చమ్మనులాలుగారి యభిప్రాయము.

ఈ దిగువషరతులతో నే నామోదించుచున్నాను:–1. బాలిక వివాహవయస్సు 16 యేండ్లకు హెచ్చింపబడవలెను. 2. అన్నివివాహములను నిర్బంధముగా రిజిస్ట్రీచేయించుట కధికారముగైకొనవలెను. 3 బాల్యవివాహములు జరుపువారికి విధింపబడుశిక్ష అట్టివివాహములను వారు మరల జరుపకుండునట్లుగా విధింపబడవలెను.

## గంగానంద సింహాగారి యభిప్రాయము.

14 యేండ్లు బాలికలవివాహమునకు అత్యున్నత వయస్సుగా హిందూసంఘములో నెక్కువమందిచే పరిగణింపబడునని నేను తలచెదను. మహమ్మదీయ, క్రైస్తవ, పార్సీ, సంఘములును, హిందూ

సంఘములో కొంతభాగమునుగూడ 14 యేండ్లకంటె తక్కువ వయస్సు బాలికలవివాహవయస్సుగా శాసింపబడు నెడల, తమ తమ సంఘములలో నిర్ణయింపబడిన వివాహవయస్సును తగ్గించుటకు యీచట్ట ముద్దేశింప బడినట్లుగా భావించెదరని నేనెరుగుదును. అయినప్పటికిని, హిందూసంఘములలో నెక్కువభాగము రజస్వలా పూర్వ వివాహమున కనుకూలముగా చాల దృఢాభిప్రాయము గలిగి యున్నారను విషయము నేను గుర్తింపకపోలేదు. వీరు వివాహము నొక పవిత్రకార్యముగా జూచెదరు. వారిలో సామాన్యముగా వివాహము జరుపుటకు గర్భాధానోత్సవ మొక యవసరకార్యముగాదు.

హిందూమహాసభలోను అఖిలభారత సనాతనధర్మ మహాసభయును గూడ బాలికల వివాహవయస్సు 12 యేండ్లకు తక్కువ కాకూడదనియు, బాలికకు 16 యేండ్లవయస్సురాక పూర్వము గర్భాధానోత్సవముజరుపబడగూడదనియు నిర్ణయించినవి. హిందూప్రజలలో గలయిట్టియధిక సంఖ్యాకాభిప్రాయములనుత్రోసిబుచ్చుట న్యాయము గాదు. కావున బాలికల వివాహవయస్సు 12 యేండ్లకు తక్కువ కాకూడదని నిర్ణయింపబడుటయే న్యాయమని నేను తలంచెదను. ఇంత కెక్కువవయస్సు నిర్ణయింపగోరువారు అట్టి నిర్ణయ మామోదింపబడుటలో గల కష్టములను గుర్తించి ప్రస్తుతము 12 ఏండ్ల వయోనిర్ణయముతోనే తృప్తినొందెదరని నేను దలంచెదను. ఇట్టి సవరణతో గావింపబడిన శాసనమున కయినను యెంత వరకు విజయము చేకూరునో మనము కనిపెట్టిచూడవలసియున్నది.



To

# The Secretary,
# Legislative Department,
# Govt. of India, Simla.

The humble memorial of the Hindus of several Commnnities of the...........District, Madras Presidency, protesting against the passing of the Child - Marriage Reform Bill introduced (into the Legislative Council, Madras; into the Legislative Assembly, Delhi and praying that it) may not be proceeded with or given effect to, if obstinately passed even.

May it please Your Excellency,

1. The memorialists emphatically though humbly protest against the passing of the Child Marriage Bill introduced into the Legislative Assembly by Mr. Harabilas Sarada, and by Dr. Muthu Lakshmi Reddi's similar Bill in the Madras Legislative Council, for the following amongst other reasons:—

2. The Bills are quite in contravention of the letter and spirit of the injunctions laid down in the Hindu Dharma Shastra and to permit the passing of such Bills penalising the Hindus for performing the marriages of their children according to their religious laws and customs is in open defiance and utter disregard of the Queen's Proclamation of 1858 promising neutrality in respect of religious and social matters.

3. The fundamental Hindu conception of marriage as a religious sacrament is unlike the manifold different conceptions of the same by followers of other religions; this is completely overlooked by the supporters of the

Bills in question. The Hindu Marriage is a sacrament and not a contract. It is based on religious doctrines and cannot therefore be made the subject of legislation.

4. The promoters of the Bill in the Legislative bodies concerned in their political frenzy have completely ignored the principles of religious neutrality. They evidently desire to drive peaceful citizens to the brink of revolution and have entirely forgotten that they have not got the sanction behind them of their constituencies in the matter of socio-religious legislation. In particular the memorialists beg to urge that Mr. S. Srinivasa Iyengar, M. L. A., who was the only Madrasi Member of the Select Committee on Mr. Sarada's Bill, does not represent in any sense the orthodox Hindus of Madras Province.

5. It is surprising that these Indian Legislative bodies are going a step further than even Englishmen in their eagerness to imitate the latter. The Law in England does not prohibit or declare void marriages of girls above 12 years and before their age of puberty; in India on the other hand according to Sastraic injunctions and traditions a girl among the Brahmin, Vysya and several other communities must be given away in marriage before she attains her puberty and violation of this would make the parents of the girls sinners, and the society looks upon them as outcastes. This bill if made into an Act would certainly throw all the orthodox Hindus into confusion and there would be no remedy except to undergo the penalties imposed by the Act. The so-called Indian leaders have neither patience nor self-sacrifice to popularise their views but want to enforce their new-fangled ideas at the point of the bayonet as they wrongly imagine that such legislation would hasten the attainment of Swaraj.

6. The Members of the Legislative bodies concerned profess several and different religions and are utterly incompetent to sit in Judgment over the religious rights of the orthodox Hindu community. Even the few Hindu members thereof represent only the political creeds of various parties and are not elected to represent the religious views of Hindus at large.

7. The majority of such Legislative bodies have no right to legislate against the wishes of any minority in matters affecting religion and social custom; they have no right to compel minorities to abrogate their own principles and forsake their own conscience. Such a legislation is bound to create revolution among those affected and aggravate the communal bitterness already rampant in the country.

If at all they want that this reform should be effected only permissive legislation legalising post-puberty marriages among the Brahmins may be made as done in the case of the Hindu Widow re-marriage Act, without enforcing reform with a penalty.

8. The Brahmos and Arya Samajists do not in any way represent the Orthodox opinion of caste Hindus. This matter can under no circumstances be compared to the Sattee which is put off by legislation. Performance of "Sattee" is not mandatory on the widows according to Sastras but on the other hand recommendatory. The Government is but justified in suppressing outrageous and objectionable conduct on the part of those who instigate the widow to loose her life by throwing herself into the funeral pyre of her husband under compulsion.

9. The mere paper demonstration of social Reformers and Brahmo Arya Samajists in the English Newspapers should not be counted as indicating the general willingness of the communities concerned viz., the Brahmins, the Vysyas and several others to submit to the said legislation. The politically minded leaders, prominently mentioned in Newspapers, are not properly giving ventilation to the views of the Orthodox Hindus and the minor vernacular papers are completely ignored. It is a misfortune in India that the views and tastes of the Editors of Newspapers are a factor of great consideration in selecting and dissiminating the views of the people even in matters vitally concerning them.

10. It is only the English educated women of the land that are making their views known, and even amongst them there are several opposed to this legislation. As regards Indian women proper, who are in larger numbers, who are in agreement with the shastraic traditions and customs, their opinions are beyond the accessability of public representation. They even feel it an insult if their opinion is sought on this matter, since zealous, as they are, to this custom and tradition, the violation of which they can never tolerate. Taking advantage of the meekness and silence of the majority, a few ultra are seeking to represent their entire sex in India.

11. In conclusion, the memorialists humbly pray that your Excellency may be graciously pleased to veto the Bills even if they should be passed by the legislatures concerned and not give effect to them and thereby protect not only the religious principles and scruples of the orthodox communities affected, but also prevent the socio religious war and revolution that must necessarily ensue if these Bills are passed into Law.

# ఘనతవహించిన ఇండియా గవర్నమెంటు లెజిస్లేటివ్ డిపార్టుమెంటు, శక్రటరిగారి సన్నిధికి-

చెన్నరాష్ట్రములోని ............ జిల్లాకు చెందిన వివిధకులము లకు చెందిన హిందువులమగు మేము మదరాసు శాసనసభలో ఇటీవల ప్రవేశపెట్టబడినట్టియు, సామ్రాజ్యశాసనసభలో చర్చింపబడు చున్నట్టియు "హైల్లుమారేజి రిఫారంబిల్లు" లను ప్రభుత్వమువారు చర్చకు రాకుండునట్లు నిరోధించవలయుననియు, ఎట్లయినను చట్టము కావింపబడినయెడల ఆచరణలోనికి రాకుండునట్లు "వీటో" చేయ వలయుననియు వినయపూర్వకముగా ప్రార్థించుచు సమర్పించుకొన్న మహాజరు అర్జీ.

ఘనమైన అయ్యా!

1. ఈ మహాజరుదారులు వినయపూర్వకముగా ప్రార్థించు విషయ మేమనగా, మదరాసు శాసనసభలో డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డి గారిచేతను, సామ్రాజ్యశాసనసభలో "హరవిలాసశారదా" గారి చేతను ప్రవేశపెట్టబడిన "హైల్లుమారేజిబిల్లు" క్రమమైనది గాదనియు ఈ క్రింద చెప్పబోవు కారణములచేత మా అసమ్మతికి పాత్రమైన దనియు తెలుపుకొనుచున్నాము.

2. ఈ బిల్లు హిందూధర్మశాస్త్రములలో చెప్పబడిన న్యాయ ములకున్నూ సాంప్రదాయములకున్నూ సంపూర్ణముగా వ్యతిరేకమై నందువల్లనున్నూ, శాస్త్రమతాచారముల ననుసరించి తమ తమ పిల్ల లకు పెండ్లి చేయు తలిదండ్రులు మున్నగువారిని శిక్షించుమని ప్రేరే

పించుటచేతనున్నూ, శాస్త్రప్రసిద్ధమై సనాతనముగా జరుపబడుచున్న ఆచారమునకు వ్యతిరేకమగుటయేగాక 1858 సంవత్సరమున మతసంబంధములైన విషయములలో తాటస్థ్యమును వహించెదమని ప్రకటించిన ఘనతచెందిన శ్రీవిక్టోరియారాణిగారి ప్రోక్లమేషనుకు విరోధమగుటచేతనున్నూ న్యాయమైనదికాదు.

3. హిందూమతస్థుల వివాహము మత సంస్కారము గాని పాశ్చాత్యదేశమునందువలె కంట్రాక్టుగాదు. కనుక తలచినప్పుడు మార్చుకొనుచుండుటకుగాని విచ్ఛేద మొనర్చుకొనుటకుగాని అవకాశము లేనిదను విషయమును యీ బిల్లు తెచ్చినవా రెంతమాత్రము గమనించుటలేదు. ఇది మతసాంప్రదాయములకు సంపూర్ణముగా చెందినవిషయము కనుక దీనినిగురించి చట్టము లొనర్చుటకు ఎవ్వరికి అధికారముగాని అవకాశముగాని ఎంతమాత్రము లేదు.

4. ఈ బిల్లును ప్రవేశపెట్టినవారు "మతసంబంధమునందు తాటస్థ్యభావము వహించవలయు" నను ముఖ్యసూత్రమునే మరచి రాజకీయములతో దీనిని ముడిపెట్టుచున్నారు. తాము ఎవరిచేత యోందు కొఱకు యీ సభలకు ఎన్నుకొనబడిరో అట్టి వోటరుల అభిప్రాయములను ఇష్టములను ఆలోచించక మత సాంఘిక విషయములందు చట్టములకావించుటకు ప్రయత్నించుచున్నారు. ఈ సందర్భమున చెన్నరాష్ట్రమునకు చెంది, యీ శారదాగారి బిల్లును చర్చించిన సెలెక్ట్ కమిటీలో సభ్యుడగు యస్. శ్రీనివాసయ్యంగారు ఆర్థడాక్సు హిందువుల యభిప్రాయమును ప్రకటించువారు కానే గారు.

5. ఇండియా శాసననిర్మాణసభలోని సభ్యులు ఇంగ్లీషువారిని అనుకరించుటలో వారికన్నను ముందంజ వేయుచున్నారు. ఇంగ్లండునందు 12 సం॥ లోబడి రజస్వలాత్పూర్వమే చేయబడిన వివాహ

ములు చట్ట సమ్మతముగా నున్నవి. రజస్వలాత్పూర్వమే వివాహము చేసి తీరవలయునను శాస్త్రసంప్రదాయ నిర్బంధముగల హిందూదేశ మునందు శాస్త్రసమ్మతముగా చేయబడు వివాహములను శిక్షాపాత్ర ములుగా చేయుట ఏటిధర్మమో ఊహింపజాలకున్నాము. బ్రాహ్మణ వైశ్యాది కొన్నిసంఘములవారు రజస్వలాత్పూర్వమే వివాహము చేయనియెడల పాపులై సంఘబహిష్కృతులగుదురని శాస్త్రాచార ములో ఘోషించుచుండగా అట్టివారిని బలాత్కారముగ శాసనమను మిషతో దండించుటన్యాయ్యమైన ప్రభుత్వముయొక్క ధర్మముకాదు. ఈ బిల్లును చట్టముగా నొనర్చినయెడ అర్థడాక్సు హిందువులు శిక్షను పొందుటకైన అంగీకరించెదరుగాని శాస్త్రవిరుద్ధమైన ప్రభుత్వచట్ట మును వివాహవిషయమై ఎన్నటికిని అంగీకరింపరు. హిందూనాయ కులమని తలంచు ఇప్పటి ప్రముఖులు ఇట్టి చట్టములవలననే తాము కోరెడి స్వరాజ్యము లభింపగలదను పిచ్చిఊహగలవారై తమ యభి ప్రాయములను ప్రజలకు ఉద్బోధించి వారిని తమవైపు ఆకర్షించుటకు బదులుగా శాసనమను తుపాకిని చూపించి భయపెట్టుట యెప్పటికిన్ని న్యాయముగాదు. అంతగా కావలసినయెడల విడోమారేజి ఆక్టువలె ఐచ్ఛికముగ జేసికొన వచ్చును.

6. శాసనసభలయందు గల నానావిధ మతములకు చేరిన శాసన సభ్యులు రాజకీయవిషయముల చర్చించుట కేర్పడినవారు గాన హిందువుల మతవిషయములగు చట్టముల నిర్మించుటకు వారికెట్టి అధి కారమున్నూ లేదు.

7. అల్పసంఖ్యాకుల మతాచారస్వాతంత్ర్యముల నిర్మూలించు శాసనముల చేయుటకు శాసనసభలయందు గల అధికసంఖ్యాక సభ్యు లకు హక్కు లేదు. దీనివలన లేనిపోని అసంతృప్తిని సంఘమునందు మాత్రము కలుగజేయగలరు.

8. బ్రాహ్మసమాజికులును, ఆర్యసమాజికులును, సవర్ణ హిందువులకు ద్వేషులుగాని అనుకూలురుగారు. కొందఱు మత విషయమైన సహగమనమును ఆపినటుల దీనిని ఆపవచ్చుననుచున్నారు. కాని అది తప్పు. సహగమనము ఐచ్ఛికముగాని నిర్బంధము కాదు. స్త్రీ ఇచ్ఛకు వ్యతిరేకముగ సహగమనమును ఎవ్వరో బలాత్కరించి చేయించుచున్నందువలన దానిని ఆపుట ప్రభుత్వమువారి ధర్మమే.

9. పత్రికలందుగల ఆందోళనముచూచి అధికసంఖ్యాకులు ఈ చట్టము నంగీకరించిరని తలంచుట తప్పు. ఈ పత్రిక లిట్టి విషయము నందు స్వాభిప్రాయానుకూలములైన వానినే ప్రకటించి తద్వ్యతిరేక జనాభిప్రాయమును ప్రకటించుటయే లేదు.

10. ఆంగ్లవిద్య నభ్యసించి పాశ్చాత్యాభిరుచులకు సుముఖులైన స్త్రీలే సభలు పత్రికలు మున్నగువాని మూలమున యీ బిల్లుల నామోదించుచున్నారు. వారిలోను కొందఱు వ్యతిరేకాభిప్రాయము తెలుపుచున్నారు. అధికసంఖ్యగల ప్రాచీనాచారపరాయణు లగు స్త్రీలు ఇట్టి విషయములందు తమ యభిప్రాయమును తెలుపుట కిచ్ఛగింపరు. అది వారి శాస్త్రీయవిశ్వాసము.

11. కావున ప్రభుత్వమువారు గమనించి వివాహసంబంధమైనట్టియు, శాస్త్రసంప్రదాయవిరుద్ధమైనట్టియు, ఈ బిల్లును తొలగించి మతాచార తాటస్థ్యమునందు మీకుగల యభిప్రాయమును మఱొకతూరి తెలిపి మమ్ములను సంరక్షించవలయునని ప్రార్థించుచున్నాము.

ఇట్లు మీ విధేయులు,

౧౧ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్‌స్పెక్టరు, పత్తిపాడు
౧౨ చిక్కారాజు మట్టుపల్లి రావుగారు, చెలకోతిక.
౧౩ రాచకొండ వెంకటరామయ్యగారు, ఎనమదల
౧౪ నారాయణరావుగారు, దాతారుపల్లె
౧౫ రంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు-సాపురం.
౧౬ జూలూరి వెంకటరత్నంపంతులుగారు, గుంటూరు
౧౭ భాస్కరరాయని వెంకటరామయ్యగారు, వంగపల్లి
౧౮ కవులూరి నరసింహారావుగారు, తాలూకా గుమాస్తా-నర్సారావుపేట
౧౯ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౨౦ వేలూరి రామన్నగుప్తగారు, సదాశివునిపేట
౨౧ రామూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి
౨౨ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౨౩ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం
౨౪ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం
౨౫ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్‌స్పెక్టరు - కొల్లూరు
౨౬ రంగావజ్ఝుల రంగయ్యగారు, నర్సారావుపేట
౨౭ మండ చినవెంకయ్యగారు, దండమూడి.
౨౮ శ్యామాపంతుల గోపాలరావుగారు - హైదరాబాద్.
౨౯ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యుల అయ్యవార్లంగారు - శాతాపురం.
౩౦ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం
౩౧ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం
౩౨ తాళవెలిమ లింగన్నమొకద్దంగారు-గడిపెద్దాపురం
౩౩ కిషన్‌రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి
౩౪ వెంకటరాజయ్య, మక్తేదారుగారు - సీతారాంపురం
౩౫ సుబ్బారెడ్డి దేశముఖుగారు, క్షీరసాగరం.
౩౬ కుంటపల్లి రామారావుగారు, సంగెం.
౩౭ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు
౩౮ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.
౩౯ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము
౪౦ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము
౪౧ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు
౪౨ కొండంభట్లగారి వెంకన్నగారు, గుమ్మడిదల
౪౩ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి దేశముఖుగార్లు-నారాయణపురం
౪౪ చెన్నూరి నరసింహారావు దేశపాండ్యాగారు-పెదవీడు.
౪౫ కందాళం కేశవాచార్యులుగారు-కిచ్చన్నపల్లె.
౪౬ కుంటపల్లి అమృతరావుగారు-సంగెం.
౪౭ మొసలి పాపిరెడ్డి మొకద్దంగారు-కొమ్మేపల్లె.
౪౮ మాణిక్యంగారి బాలకృష్ణయ్యగారు-హైదరాబాద.

# అభినవ సరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిణీకోద్ధారిణి [పూరి వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 8 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతులు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులు గారు) | | 0 | 8 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 | పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 30 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 28 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిశుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 28 | భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్ఛయనులుగారు) | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీకార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరు జిల్లా.